ప్రియా దెయ్యంగారు

నేనొక ప్రియమైన పిశాచిని

# భజన ఉవాచ: అత్యాచారానికి శిక్ష తక్కువగా ఉండాలి!

MARCH 8, 2011 22 COMMENTS (HTTPS://PRIYADAYYAMGAARU.WORDPRESS.COM/2011/03/08/%E0%B0%AD%E0%B0%9C%E0%B0%A8-%E0%B0%89%E0%B0%B5%E0%B0%BE%E0%B0%9A-%E0%B0%85%E0%B0%A4%E0%B1%8D%E0%B0%AF%E0%B0%BE%E0%B0%9A%E0%B0%BE%E0%B0%B0%E0%B0%BE%E0%B0%A%E0%B0%B6/#COMMENTS)



“దున్నపాలు తినవలే వింతవింతలు” అని పాడుకుంటూ వచ్చింది భజన

“ఏంటి భజనా, దున్న పాలని తినటం ఏమిటి?” అర్థం కాలేదు నాకు. భజన లాంటి జీనియస్ ఇలా పాడుతోందేమిటా అని

“ఓ అదా, అందుకే వింతవింతలూ అని చివర్లో కలిపా” అంది నవ్వుతూ

అబ్బా, అంత చిన్నవిషయం కూడా నాకు తట్టలేదు…….

“సరేగానీ భజనా ఈ రోజు హాట్ టాపిక్ అత్యాచారానికి శిక్ష. దీని మీద నీ అభిప్రాయమేమిటి? కొంతమంది మరణ శిక్ష అంటున్నారు, మరి కొంతమంది కాళ్ళూ చేతులూ తీసెయ్యమంటున్నారు”

“అవన్నీ తెలివితక్కువ సలహాలు. బూమరేంగ్ అవుతాయి” తొణుకు బెణుకు లేకుండా చెప్పింది భజన

“ఎందుకని? అన్యాయం చేసినవాడిని కఠినంగా శిక్షించకూడదా?” నాకు కోపం వచ్చింది.

“విను ప్రియా, నువ్వు పిల్ల పిశాచివి. నీ చేతిలో (క)పాల glass లాక్కోవటమే అత్యాచారం అనుకునేదానివి. కానీ ఇక్కడ విషయం చాలా సీరియస్”

“అవునా, చెప్పు మరి”

“విను. ఒక మనిషిని హత్య చేస్తే, క్రిమినల్ హిస్టరీ లేనివాడికి సాధారణంగా పడే శిక్ష ఏమిటి?” అడిగింది భజన

“శ్రీకాకుళం పంపించటం” చెప్పాను నేను

“జోకులు తరవాత గానీ సమాధానం చెప్పు”

“సరే యావజ్జీవం. అంటే 14 ఏళ్ళు”

“కరెక్ట్. ప్రవర్తన బాగుంటే ఇంకా తగ్గచ్చు. అంతే కదా?”

“అవును” ఒప్పుకున్నాను నేను.

“సరే, ఇప్పుడు ఒకడు ఒక అమ్మాయిని బలాత్కరించాడు అనుకుందాం. ఆ అమ్మాయి బ్రతికితే, నువ్వు అంటున్నదాని ప్రకారం వాడికి పడేది మరణ శిక్ష.

కానీ బలాత్కరించిన తరవాత చంపేస్తే? చనిపోయిన వారి విషయంలో బలాత్కారం నేరం నిరూపించటం చాలా కష్టం.

కనుక వాడికి పడేది యావజ్జీవం మాత్రమే” అంది భజన

“నిజమే సుమీ!” ఒప్పేసుకున్నాను నేను

“అంటే దీనర్థం, నువ్వు చెప్పినట్టు గనక జరిగితే బలాత్కరించబడిన ఒక్క స్త్రీ కూడా బ్రతకదు. ప్రాణం కన్నా మానం (తన తప్పు లేకపోయినా) ముఖ్యమనేవాళ్ళ సంగతేమో గానీ నాకు మాత్రం ఆమె ప్రాణాలతో ఉండటమే ముఖ్యం. అందుకే అత్యాచారానికి శిక్ష మరణశిక్షకన్నా తక్కువగా ఉండాలి. అయితే చాలా కఠినంగా ఉండాలి” అని ముగించింది భజన.

భజనలాంటి జీనియస్ ని అపార్థం చేసుకున్నందుకు నేను పశ్చాత్తాపంతో రగిలిపోయా (దెయ్యాన్ని కదా, కుమిలిపోయాననటం బాగుండదని)

FILED UNDER UNCATEGORIZED

## 22 Responses to *భజన ఉవాచ: అత్యాచారానికి శిక్ష తక్కువగా ఉండాలి!*

**సోదరి రుధిర says:**
March 8, 2011 at 6:00 pm
“@ Badam కర్రీ మీ కామెంట్ చూట్టం వల్లనేమో మళ్లీ ఇవాళ ఈ దెయ్యం పాట పెట్టాలనిపించిది .కృతజ్ఞతలు .నాకూ దెయ్యాల పాటలంటే చాలా ఇష్టం .మీరూ షేర్ చేయండి .

**శ్రీ says:**
March 9, 2011 at 3:48 am
hi hi heeeeeeeeeeeeeeeeeeeee.. good logic…!!! దెయ్యాన్ని కదా పశ్చాత్తాపంతో రగిలిపోయా…kevv….!!!

**నూకార్జున says:**
March 9, 2011 at 6:12 am
దున్నార్జున అంట, గేదార్జున అంట, మేకార్జున అంట, భజనాడ్రామార్జున అంట

కొత్తగా వచ్చిన పాత ఏంట్రీ
ప్రియార్జున అంట….

**మందు says:**
March 9, 2011 at 6:14 am
దెయ్యార్జున మిస్సింగ్!! నేనొప్పుకోను! :X

**మర్కటకవి says:**
March 9, 2011 at 6:16 am
సర్వం భజనడ్రామా మయం..

ప్రియా దయ్యం కనపడాలంటే చీక్కుళం వెళ్ళండి

**..nagarjuna.. says:**
March 9, 2011 at 10:28 am
>>ప్రియార్జున అంట….

ROFL…..

**కూరతీక్ ఎలుగుబంటి says:**
March 9, 2011 at 5:19 pm
దెయ్యం కళ్ళముందే కనిపిస్తున్నా ….
….. అందరం బురదలో పడ్డాంగా?

**అక్షర పైత్యాలు says:**
March 9, 2011 at 5:37 pm
కొరివి దెయ్యం రాక్షసి నే చూస్తూ రగిలిపోతుంది , ముందుకు వంగిపోతుంది.
ఆడ దెయ్యం గోరీ ని చూసి పొంగి పొతుంది, అక్కడే ఆగిపోతుంది

**అక్షర పైత్యాలు says:**
March 9, 2011 at 5:39 pm
ఒక్కోసారి ఏమీతెలీని ఎదవబతుకే బాగుంటది.
ప్రేతం లేకపోయినా కనీసం ప్రయాణమైనా పాడెక్కుతుంది

పైత్య

**చాలా హింస says:**
March 9, 2011 at 5:46 pm
తూట్లు పొడిచిన తుమ్ములు వెక్కిరిస్తున్నాయ్
ఈ కంపు రాని శరీరాలని ,
తప్పుచేయమని తంతున్నాయి.
నా చేత సరిపోని కపాలాలని .
నిర్లక్ష్యం నిప్పుల్లో శవాల మంట
కాలి పోతుంటే,
అప్పిచ్చినోళ్ళు.. అగ్నిలో
అపాను వాయువు ఆవిరైపోతూంది.
ప్చ్ … నువ్వు మాత్రం ఇప్పటికీ

అక్కడే అలాగే ముక్కు చీదుతూ ఉంటావ్
చిలిపిగా.. చితిలో
చింతకాయలు ఏపుతున్నావ్ ….

**చాలా హింస says:**
March 9, 2011 at 6:18 pm
వరసగా వందోసారి కాటిలో నా కవిత "కొరివి"

గులగుల గులగుల వేన్నీళ్ళు – కన్నీళ్ళు రాని కవి లేడు.
నిశీధి నిశ్శబ్ద ఒంటరి రాతిరి పిశాచి తో గడపని కవి లేడు.
రగిలే చితికే పగిలే పుర్రెని తోడుగ వదలని కవి లేడు
కారప్పొడి – కందిరీగ వెంబడి కొరివితో కదలని కవిలేడు.
విశాల శ్మశానపు శవాల మెరుపులు,
సమాధిలో ఊరిన కమ్మని కలుపులు ,
సిగ్గుతో అరిచిన నక్కల అరుపులు

ఇంగితం పై ఇనపకలం తో ఇస్త్రీ చెయ్యని కవి లేడు.

కవి

నేను ప్రేతాలపాకాన్నీ, భూతాల బంకమన్నునీ ఎక్కువగా భుజించగలను…అందుకే కవినయ్యాను!

**మందు says:**
March 9, 2011 at 6:36 pm
"హ్మ్! ఇప్పటితరానికి ఈ పోస్టు వర్తించదు…కానీ మీరన్నట్టే కొన్ని దెయ్యాలు అలాగే ఉన్నాయ్! అది ఎవరికీ తెలియకుండ శవాలని కప్పెట్టేసేవారు చాలా మందీ ఉన్నారు! మీరన్నట్టు ఎప్పుడో మరి స్మశాన స్వేచ్ఛ వచ్చేది!!"

**మందు says:**
March 9, 2011 at 6:39 pm
"నాకు ఇవి తెలుసు 🙂 భలే ఉంటాయ్! మీ బ్రెయిన్ డెడ్ మంచురియా….లివర్ బాసుంది కూడా ట్రై చేసా! భలే వచ్చాయ్! అసలు ప్రేగుల పాస్తా ఐతె..కేక పుట్టించిందనుకోండీ! కానీ బాసుందీలో రక్తం పొయ్యగానే పాలు విరిగిపోయాయి ఎలా మరి??"

**డిప్పారావు మేస్త్రీ says:**
March 9, 2011 at 6:43 pm
దెయ్యంగారూ మే బేక్ గ్రవుండ్ లో నలుపు బాలేదు పసుపు పెట్టండి

**దెయ్యప్పొడి says:**
March 9, 2011 at 6:51 pm
"మీరేంటండీ ఇంకా శవం లాగనె ఉన్నారు గదా. అప్పుడే ఇంత వర్రీసా?"

**పేను says:**
March 9, 2011 at 6:57 pm
"సాటి దెయ్యాలకు ఉప్పందిచ్చే లక్షణం దెయ్యాల స్థాయిని ఉన్నతీకరిస్తుంది. ప్రియ లాంటి గొప్ప దెయ్యం పాత్ర సృష్టికర్త నిజజీవితంలో కూడా కష్టాల పాలైన వైనం 'క్రియరాగాలు'లో చదివి, ఆశ్చర్యపోయాను. భజనలోని వదాన్యత కోణం ఈ వ్యాసం ద్వారా చదివాక, ఆమె పట్ల నాకు గౌరవం పెరిగింది. ఈ సంఘటనను గుర్తు చేసుకుని, టపా గా అందించిన మీకు అభినందనలు!"

**Apparao Sastri says:**
March 10, 2011 at 10:42 am
బ్యాక్ గ్రౌండ్ వైట్ కదా మరి బ్లాకు అని అంటున్నారు ?
మొత్తానికి కామెంట్స్ బాగానే ఫాలో అవుతునారు
ఈనాడు సాక్షి ఒకరి మీద ఒకరు బురద జల్లుకుంటే ఇద్దరికీ సర్క్యులేషన్ పెరుగుతుంది
దెయ్యం గారిని మరీ అలా ఇబ్బంది పెట్టకండి :))

**వధువరి says:**
March 10, 2011 at 6:22 pm
"ట్యాంకుబండ్ మీద ఉన్న దెయ్యాలను వెళ్ళగొడతామని తెరాస నాయకులు గతంలో ప్రకటించారు. వారిలో కేటీయారు కూడా ఒకడు. ఇలాంటి రెచ్చగొట్టే మాటలు చాలనే మాట్లాడారు. వాటి పర్యవసానమే నేటి భూతాల మార్చిలో దెయ్యాల గోల!

**గిరగిరన్ says:**
March 10, 2011 at 6:23 pm
"ఆహా…ఓహో ….అప్పు..కేవ్వ్వ్వ్వ్వ్..చాలా చాలా బాగుంది..మొదటి శవాన్ని చంపి మళ్ళీ ఇంకో 2 సార్లు దాన్నే చంపి వచ్చాను.. 🙂

**భక్షణ వాహనం says:**
March 10, 2011 at 6:25 pm
వలువలు విధ్వంసం అయ్యాక, పిశాచాలు విచక్షణ కోల్పోయాక ఇహ విగ్రహాలు ఓ లెక్కా..? ప్రియ, భజనల అనిశ్చిత స్థితికి తగిన మూల్యం చెల్లించుకుంటున్నాం.."

**గోలేటీ says:**
March 10, 2011 at 6:30 pm
"పై కామెంట్లు చదివిన తర్వాత ఒక విషయం రాయాలని పించి రాస్తున్నాను. మన పైశాచిక భాష లో వున్న అక్షరాలు పలికే టప్పుడు మన నోరు అనేక విధాల తిరుగుతూ వుంటుంది.. ముఖ్యంగా నాలిక చేసే విన్యాసాలు గమనించండి.(కొన్ని పదాలు పలికేటప్పుడు ముక్కుకి కొన్ని పదాలు పలికేటప్పుడు వెనక్కి, ఇలా తుంటికి తగులుతూ వుంటుంది.. ఈ గొప్ప తనం ఒక్క పైశాచికం లోనే వుంది.. అందుకే రాక్షస డ్రేక్యూలా "ప్రేత భాషలందు పైశాచికం లెస్స" అని పొగిడాడు. రాక్షస వాగ్గేయ కారులెందరో తమ కీర్తనలని పైశాచికం లోనే పాడారు..

**పారిస్ గడ్డి says:**
March 10, 2011 at 6:33 pm
@స్మశానంలో బొమికలు తిని…ఇంత నీచపు పద ప్రయోగం సబబేనా? డ్రేగనన్న వారం దీక్షలో అలాగే తినొచ్చాడంటావా? డ్రామన్న, బాజన్న తదుపరి డ్రేగన్న బాటలో కాదా??